Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.

సంపుటము 20 { 1928 సం॥ మే నెల. } సంచిక 2

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swárnakaravyavaharam
etc., etc.

# ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, నారాయణపేట.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, దుబ్బాక.
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాదవరం.
౪ రామసింగుగారు- నెల్లుట్లసాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౫ శ్రీమద్వేంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము

# పోషకులు.

౧ రాజా వెంకటాద్రియప్పారావు, బహదరుగారు, జమీందారుగారు-నూజవీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానకొండూరు
౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్తారు, దేశముఖు, మసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జనగాం
౧౧ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౧౨ కేతులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౩ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౪ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, విశాఖపట్టణంజిల్లా
౧౫ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, పాకాల.
౧౬ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౭ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,

# సహాయులు

౧ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౨ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౫ నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు, తమ్మవరం.
౬ వెలమకన్ని శోభనాద్రిరావుగారు - శోభనాద్రిగూడెం.
౭ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, సాపురం.
౮ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౯ వెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౧౦ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

అభినవ సరస్వతి

సంపుటము ౨౦ { జానపాడు / విభవ సం॥ వైశాఖమాసము } సంచిక ౧

# రామాయణ మహాభారతములందు వచ్చెడి స్థలముల వివరము.

రామాయణ మహాభారత కథలు మున్నగునవి చదువునపుడు గాని, బాలురకు చెప్పునపుడుగాని, ఎన్నియో దేశములు, పట్టణములు, నదులు, పర్వతములు, మొదలగువాని పేళ్లు వచ్చుచుండును. ఆ దేశములు మున్నగునవి ఎక్కడనున్నవో, ఉన్నవో లేవో, ఉన్నచో వాని ప్రస్తుతనామము లెవ్వియో, యని పలువురకు పలువిధములగు సందేహములు కలుగవచ్చును. నాకును నిట్టి సందేహము లెన్నియోమారులు కలిగినవి. ఇదియునుగాక, 1921 సం॥ T. S. L. C. లోయర్ గ్రేడ్ పరీక్షకు పెట్టియుండు భారతవీరుడు, సీతారామము—ఈ గ్రంధములలో నెన్నియేని యిట్టి స్థలములపేళ్లు వచ్చుచున్నవి. సామాన్యముగ విద్యార్థులకు వానివిషయము తెలిసికొనుటకు తగినవీలుండదు. ఇట్లెందరకో సందేహమునుగొలుపు విషయములను వివరించుటకై ఈ విలేఖను వ్రాయుచున్నాడను. వలసినంత యవకాశము లేమిచే ఈ స్థలములను తెలియపరచు పటమును ముద్రింప సాధ్యము కాదాయెను.

కోసలము:– సరయూనదీ ప్రాంతమునసుండిన యొకదేశము. ఇప్పుడీదేశము ఔడ్ (Oudh) అని పిలువబడుచున్నది. దీనికి రాజధాని అయోధ్య. సూర్యవంశపురాజులు దీనిని పాలించుచుండిరి. శ్రీరాములకాలమునకు పిమ్మట దక్షిణకోసల మను దేశ మొకటి యేర్పడుటచే ఇది ఉత్తర కోసలమని పిలువబడుచుండెను.

విదేహ:— దీనిని మిథిలదేశమని కూడ అందురు. ఇది జనక మహారాజు పాలించిన దేశము సీతాదేవియొక్క జన్మభూమి. ఇది

యిప్పుడు ఉత్తర బీహార్ (North Bihar) అనబడును. దీనికి రాజధాని మిథిల. కోసలదేశమునకును విదేహదేశమునకును గండకీ నదియే పొలిమేర యనియును, కోసల మానదికి పడమటను, విదేహము తూర్పునను ఉండినట్లు చెప్పుచున్నారు.

లంక — "ప్రస్తుతము సిలోన్ అనఁబడు సింహళము రావణాసురుని లంక కాదనియు నదివేఱుగ నెచ్చటనో యుండెననియుఁ గొందఱు తలంచెదరు. కాని పురాతన గ్రంథములు చూడగా మన వాండ్రు మొదటినుండియు సింహళమునే రావణాసురుని లంకగాఁ దలంచుచుండిరని తోఁచెడిని చరిత్రాత్మకమైన రాజతరంగిణి యను గ్రంథములో సింహళ లంకాద్వీపముల యైకమత్యమే చెప్పఁబడి యున్నది. సింహళములోని శాసనములలోఁగూడ నిదియే లంక యని యున్నది. కానఁ బ్రస్తుతపు సింహళమే రామాయణీయ లంక యని గ్రహించవలెను.

దండకారణ్యము — ఇదియొక గొప్పయరణ్యము. దీనికి ఉత్తరమున గంగానదియొక్క దక్షిణతీరమును వింధ్యపర్వతమును, దక్షిణమున ద్రవిడ పాండ్య దేశములును ఉండినట్లు చెప్పుచున్నారు. దీనికీ పేరు దండుడను వానివలన గలిగెను. వీడు ఇక్ష్వాకు పుత్రుడు. వీడు నీతిమాలి ప్రవర్తించుచుండ వీనితండ్రి వీనిని పట్టణమునుండి వెడలగొట్టెను. అప్పుడు వీడు రాక్షసులతో చేరి శుక్రాచార్యులకు శిష్యుడై, వింధ్యపర్వతము దగ్గిర మధుమంత మను పట్టణమును నిర్మించుకొని యందు వాసముచేయుచుండెను. ఇట్లుండ నొకనాడు వీడు శుక్రుని యాశ్రమమునకు పోయియుండి అక్కడ శుక్రుని కూతురగు అరజ యను నామెను చూచి మోహించి, బలాత్కరించి చెరిచెను. "అది శుక్రుడు విని కోపించి అప్పుడు దండుడు ఉన్నచోటుచుట్టు పంద్రెండు ఆమడలమేర మట్టివాన కురియునట్లును, దండుడును వానివారలును అందు అణగి నశించునట్లు శపించెను. అంతట అచ్చటి జను లందఱును వెఱచి పాఱిపోయిరి. దండుడు తన పరివారములతోడ ఆ మట్టివాన యందు అణగి నశించెను." ఈ యరణ్యమున ననేక ఋష్యాశ్రమము

లుండెను. భరద్వాజుఁడు, అత్రి, శరభంగుడు, అగస్త్యుడు మున్నగు వారల యాశ్రమము లన్నియు నిందుండెను. ఇం దనేక రాక్షస నివాస స్థానములుకూడ నుండెను. విరాధవన మిక్కడ నుండెను. ఈ యరణ్యమున "జనస్థానము" అను నొకప్రదేశమున రావణాసురుని మూలబలములలో నొకభాగ ముండెను. దానికి ఖరుడు నాయకుడుగ నుండెను.

పంచవటి:— "రాముడు వనవాసము చేయునపుడు దండకారణ్యమునందు ఆశ్రమము కావించుకొని యున్నచోటు. అయిదు మఱ్ఱిచెట్లచేరిక అని శబ్దార్థము. ఇది గోదావరి పుట్టుతావునకు సమీపమున నుండును. ఈ తావున ఇపుడు నాసికాపురి (Nasik) ఉన్నది."

చిత్రకూటము:— ఇది బుందల్ ఖండమున ( Bundelkhand ) నున్నది. ఇందు వాల్మీకి ఆశ్రమ ముండినది. రాము డరణ్యావాసమునకు పోవునపుడు ఇక్కడ కొన్నిమాసములు నివసించియుండెను. ఇది మిక్కిలి పవిత్రమైన స్థలము. ఇక్కడ ననేక దేవాలయము లున్నవి. ప్రతిసంవత్సరమును వేనవేలమంది వీనిని దర్శింతురు.

ఋష్యమూకము:— హంపీ విరూపాక్షమునొద్ద అనగొందికి సమీపముననుండు నొకపర్వతము. సుగ్రీవుడు తన యన్న భయముచే నిందు డాగియుండెను. శ్రీరాము లిక్కడ కొంతకాల ముండెను.

మాల్యవంతము:— ఇదియును ఆనగొందికి సమీపమున నుండు నొకపర్వతము. ఇందు శ్రీరాముడు వాలిని చంపినతరువాత వర్షాకాలమంతయును గడిపెను.

కిష్కింధ:— వాలి సుగ్రీవుల రాజధాని. ఇది మైసూరునకు కొంత ఉత్తరమున నుండినట్లు చెప్పుచున్నారు. ఈ పేరుగల కొండ యొకటి హంపీవిరూపాక్షమునొద్ద ఆనగొందికి సమీపమున నున్నది.

కురుదేశము:— ఈ దేశము ప్రస్తుతపు ఢిల్లీనగరము చుట్టుప్రక్కలను వ్యాపించియుండెను. (దీనికి నామము కురువు) అను రాజువలన గలిగెను. దీనికి హస్తినాపురము (లేక హస్తిపురి) రాజధానిగ నుండెను. ఈపట్టణము ప్రస్తుతపు ఢిల్లీకి ఈశాన్యమున సుమారు 60 మైళ్ళదూరమున నుండినట్టును గంగలో మునిగిపోయినట్లును చెప్పుచున్నారు.

ఇంద్రప్రస్థము:— ప్రస్తుతపు ఢిల్లీ (Delhi) దీనికి ఖాండవప్రస్థ మని మరియొక పేరు. ఇది పాండవుల రాజధానిగ నుండెను.

ఖాండవము — యమునానదీతీరమున నుండిన యొక వనము. కృష్ణార్జునుల సాహాయ్యముచే అగ్నిదేవుడు దీనిని భక్షించెను. ఇది యుండిన చోట ఇంద్రప్రస్థపురము కట్టబడెను. (కనుక దానికి ఖాండవ ప్రస్థమనియు నొక పేరు కలదు.

కురుక్షేత్రము — భారతయుద్ధము జరిగినచోటు. ఇది ఢిల్లీకి సమీపమున నున్నది. ఇది స్థానేశ్వరము (Thaneswar) నకు ఆగ్నేయమున నున్నది. ఇదియే స్థానేశ్వరమని కొందరి యభిప్రాయము. ఈ యుద్ధభూమి పానిపట్టు (Panipat) నకు సమీపమున నున్నది.

పాంచాలము — "పూర్వము పశ్చిమోత్తర పరగణాలు (North West Provinces) అనబడుచుండిన దేశములోఁ గొంత భాగము మహాభారతములోఁ బాంచాలదేశము హిమాలయము మొదలుకొని చర్మణ్వతీ (చంబల్) నదివఱకు వ్యాపించియుండెనని వ్రాయబడియున్నది."

అంగదేశము:— ఇప్పటి బంగాళమునందు భాగల్పురము, మాంఘిరు (Bhagalpur, Monghyr) జిల్లాలు.

వంగదేశము:— ప్రస్తుతపు బంగాళముయొక్క తూర్పుభాగము (Jessore and Krishnagar.)

కామరూపము — ఇప్పటికి బంగాళపు ఈశాన్యభాగమును, అస్సామ్ (Assam) పశ్చిమభాగమును కలిగియుండిన దేశము.

పుండ్రము:— ఇప్పటి బంగాళపు పశ్చిమ భాగము.

ప్రాగ్జ్యోతిషము:— కామరూపదేశమునకు పశ్చిమమునందు దేశము.

చేది. — ప్రస్తుతపు రీవా (Rewa) ప్రాంతమున నుండిన దేశము.

మత్స్యదేశము:— విరటుడు యేలిన దేశము. ఇప్పటి గ్వాలియర్ ప్రాంతమునందుండిన దేశము.

సాళ్వము:— రాజపుతాన (Rajaputana) పశ్చిమ భాగమున నుండిన యొక దేశము.

సౌరాష్ట్రము — (లేక సురాష్ట్రము) ఇప్పటి ఘూర్జర (గుజరాతి) దేశము (Gujerat.)

మగధ:— అంగదేశమునకు పశ్చిమమున నుండిన దేశము. ఇప్పటి బీహారమున (Behar) నొక భాగము. జరాసంధుడు మున్నగువారలచే నేలబడిన దేశము.

కుళిందము:— కాశ్మీరమున (Kashmir) కాగ్నేయమున నుండిన దేశము.

ఓఢ్రము: — (ఉత్కలదేశము) ఒరిస్సా (Orissa)

కళింగము.— ఓఢ్రదేశమునకు దక్షిణమునను కర్ణాటదేశమునకు ఉత్తరమునను ఉండిన దేశము.

విదర్భ:— ఇప్పటి బీరారు (Berar) బీదరు (Bedar) దేశములు.

నిషధ — వింధ్యపర్వతసమీపమున పయోష్ణి (Tapati) నదీతీరమున నుండిన దేశము. నలునిచే నేలబడిన దేశము.

కేరళము — మళయాళము.

# మాధవవిద్యారణ్యులు.

సకలవిద్యల సారమును, రాజ్యనిర్మాణకర్తృత్వమును, లౌకిక వైదికవ్యవహారనిపుణతయు, స్వధర్మరక్తియు, స్వదేశస్వజనభక్తియు, అనుపమేయవైరాగ్యమును ఏకీభవించి మాధవవిద్యారణ్యస్వరూపమున నవతరించెనని చెప్పుటకు సందేహము లేదు. సన్న్యాసమునకుం బూర్వ మీసత్పురుషునకు మాధవాచార్యులని పేరు. తురీయాశ్రమము స్వీకరించి శృంగేరీపీఠము నధిష్ఠించిన తరువాత నీ జగద్వంద్యునకు విద్యారణ్యులని పేరు. ఈ మాధవులు బ్రాహ్మణులు. వీరిది యజుర్వేదము, బోధాయనసూత్రము, భారద్వాజగోత్రము. వీరి యింటి

పేరు సాయణవారు. తల్లిపేరు శ్రీమతి. తండ్రిపేరు మాయణుఁడు. ఇతనికి సాయణభోగనాథులను సోదరులిద్దఱుండిరి. వీరాంధ్రులనియు, నియోగులనియుఁ గొందఱు వ్రాసియున్నారు. కాని యాంధ్రబ్రాహ్మణులలో బోధాయనసూత్రులు లేరు కావున మాధవాచార్యులవారాంధ్రులు కారని మా నిశ్చయము. వీరధిష్ఠించిన శృంగగిరిపీఠము మీఁద ప్రస్తుతమున్న శ్రీసచ్చిదానందశివాభినవనృసింహభారతీస్వాముల వారు మాత్ర మాంధ్రులు, ములికినాఁటివారు.

మాధవాచార్యులవారు ప్రథమ హరిహర, బుక్కరాయ, ద్వితీయ హరిహరరాజులకాలములో వారికి మంత్రిగను హితబోధకుఁడుగను ఉండెను. ఇతని తమ్ముఁడగు సాయణాచార్యులవారు హరిహరరాజుయొక్క యన్నకుమారుఁ డగు సంగమరాజునొద్ద మంత్రిగా నుండెను. హరిహరబుక్కరాయలను స్వరాజ్యసంస్థాపనమునకుఁ బురికొల్పి యనన్యసామాన్యవైభవభూషితంబగు విజయనగరసామ్రాజ్యమును నూతనముగా నిర్మించిన శ్రేయస్సంతయు మాధవాచార్యులదియే యని నొక్కి వక్కాణింపవచ్చును. హరిహర బుక్కరాయలు పేరునకుమాత్రము రాజులుగా నుండిరనియు, రాజ్యభారమంతయు నాశ్రమస్వీకారమునకుఁ బూర్వమును తరువాతను మాధవవిద్యారణ్యులే వహించిరనియు నైతిహ్యముఁ కలదు. యత్యాశ్రమస్వీకారముచే నైహికసౌఖ్యములం దెంతమాత్రమును నిచ్ఛలేనివారయ్యును దేశమంతయు మ్లేచ్ఛులవలన నరాజకమగుటయు శ్రౌతస్మార్తకర్మములన్నియు నశించుటయుఁజూచి స్వదేశస్వమతములను ఉద్ధరించుటకై కేవల నిరపేక్షబుద్ధితో నీ మహానుభావుఁడు విజయనగరమును హిందూ సామ్రాజ్యమును నిర్మించుట చూడ నితఁ డద్వితీయమహాపురుషుఁడని చెప్పవలసి యున్నది.

మాధవసాయణులు సంస్కృతభాషలో నున్న యన్నిశాస్త్రములలోను అపారపాండిత్యముకలవారు. వీరిద్దఱును కలిసి రచించిన గ్రంథముల సంఖ్య నూఱును మించియున్నది. అందు శ్రౌతము, స్మార్తము, వేదాంతము, ధర్మశాస్త్రము, మీమాంస, జ్యోతి

శాస్త్రము, వైద్యము, వ్యాకరణము, చరిత్ర మొదలైన యన్నివిషయములమీఁద వీరు ఉద్గ్రంథములు వ్రాసిరి. అందు వేదభాష్యము ముఖ్యమైనది. దానికి సాయణభాష్యమని పేరు. నాలుగు వేదముల యొక్క సంహితలకును బ్రాహ్మణములకును సంపూర్తిగ నీ విద్వద్వర్యులు భాష్యము వ్రాసిరి. ఈ ఘనకార్యము చేయుటలో వీరికి మఱికొందఱు విద్వాంసులును సహాయము చేసిరని యైతిహ్యముకలదు. ధర్మశాస్త్రమును గుఱించి మాధవాచార్యులవారిచే రచింపఁబడిన పరాశర మాధవీయ మను గ్రంథము మన దేశములో మిక్కిలి ప్రఖ్యాతిని జెందియున్నది. వేదాంతవిషయమై విద్యారణ్యకృత పంచదశియు, చరిత్రవిషయమై శంకరదిగ్విజయమును, దర్శనవిషయమున జైమినీయ న్యాయమాల, సర్వదర్శనసంగ్రహము అను గ్రంథములును విద్వన్మాన్యములై యున్నవి.

ఇట్లు జైనజంగమయవనాది పరమతములవారిచే ఖండితమగుచున్న వైదికమతమును ఉద్ధరించుటకు వేదభాష్యాదికములను, దేశస్వాతంత్ర్యము రక్షించుటకు విజయనగరసామ్రాజ్యమును నిర్మించి, శృంగేరిలోని జగద్గురుపీఠము నలంకరించిన యీ యతిశ్రేష్ఠుఁడు నూఱేండ్లకంటె నెక్కుడుకాలము జీవించి ౧౩౮౬ లో సమాధిస్థుఁడయ్యెను.

# విద్యానగరనిర్మాణము

విద్యారణ్యులుచేసిన మహత్కార్యములలో విద్యానగరమను మాఱుపేరుగల విజయనగరమును గట్టించుట యొక సుప్రసిద్ధమైన చరిత్రాంశమైయున్నది. దీనిని గుఱించి యనేకు లనేక గాథలు చెప్పెదరు. హరిహరబుక్కరాయలు రాజ్యము చేయుచుండగా వారొకనాఁడు వేటకై తుంగభద్రానదికి దక్షిణపుటొడ్డుననున్న యరణ్యమునకుఁబోయిరఁట. అచ్చట వేటకుక్కలు కుందేళ్ళకు జంకి పారిపోవుట చూచిరఁట. ఆసమాచారము వారువిద్యారణ్యమునీశ్వరులకుఁదెలుపఁగా నచ్చో

టఁబట్టణముకట్టిన నది జయప్రదమగునని చెప్పి వారు నూతననగరమును నిర్మించునట్లు చేసిరి. ఈపట్టణము క్రీ.శ.౧౩౩౬ కు సరియైన శా.శ.౧౨౫౮ ధాతృసంవత్సర వైశాఖశుద్ధపంచమినాఁడు నిర్మింపఁబడియె. పట్టణనిర్మాణమునకై గనిపెట్టఁబడిన యభేద్యస్థలమును బట్టియే విద్యారణ్యుల బుద్ధివైభవము వెల్లడియగుచున్నది. రామాయణీయకాలములోఁ గిష్కింధయనఁబడు పర్వతప్రదేశమునందుఁ దుంగభద్రానదికి దక్షిణతీరమున నీపట్టణముఁ గట్టఁబడినది. ఆప్రదేశమునందుఁ దుంగభద్రానది రామాయణములో వర్ణింపబడిన అంజనపర్వతము, మాల్యవంతము, మతంగపర్వతము, ఋష్యమూకము అనఁబడు పర్వతముల నంటుకొని ప్రవహించుచుండెను. ప్రస్తుతమీప్రదేశమును హంపీవిరూపాక్షమనియెదరు. ఈపట్టణమునకు పూర్వపశ్చిమప్రదేశములందు కృష్ణశిలాపర్వతపంక్తులును, దక్షిణమునందు రామదుర్గమునుగుట్టలును, ఉత్తరమునఁ గొన్నిపర్వతమాలికలును తుంగభద్రానదియు నుండుట వలన ఆపట్టణము నైసర్గికపర్వతదుర్గముగా నుండెను. ఈపట్టణమునకుఁ జుట్టును ఏడు ప్రాకారములు గలవు. అరువది డెబ్బదిమొదలు ఆఱువందల మూరలెత్తుగల గుట్టలకు నడుమనున్నస్థలమును రాతిగోడలతోఁ బూడ్చి ఈప్రాకారములు నిర్మింపఁబడియె. ఈప్రాకారములు తుంగభద్రానది యొడ్డునంటుకొనియుండుటవలన నటువైపునుండి యది శత్రువులకభేద్యమయ్యెను. దక్షిణనైరృతదిక్కులనుండిమాత్రము పట్టణములోఁ బ్రవేశించుటకు వీలుండెను. అందు నైరృతదిక్కున నొకగొప్ప చెఱువు నిర్మింపఁబడియె. చెఱువుకట్ట యొకమైలు వైశాల్యముగలదియై రాతితోఁ గట్టఁబడినందున అభేద్యమైన దుర్గపుగోడవలెనేయుండెను. ఈ చెఱువు యొక్క వైశాల్యము నాలుగుచదరపుమైళ్ళు. అందు నెల్లప్పుడును నాలుగునిలువులనీరుండును. దక్షిణపుదిక్కున నొకకోటఁగట్టి దానిని బట్టణములోనున్న పర్వతములతోఁగలిపిరి. ఆదుర్గమున కచ్చటచ్చట బురుజులుండి యవి రక్షకభటులచేఁ గాపాడఁబడుచుండెను. ఏడవదుర్గపుటావరణములో కాఁపులు వ్యవసాయముచేసి ధాన్యము పండించుచుండిరి. చెఱువులో జలము సమృద్ధిగ నుండుటచే వ్యవసాయమున కెన్నడును

భంగమువచ్చినదికాదు. సప్తప్రాకారమునకు లోపల ఒకచోట నొకగుట్ట మీఁద రాజమందిరమును సేనాధిపనివాసమును టంకసాలయుఁ గట్టఁబడెను. మొత్తముమీఁద నీయద్వితీయ పట్టణము పదునాలుగుమైళ్ళ పొడవును, పదిమైళ్ళవెడల్పును నూటనలువది చదరపుమైళ్ళ వైశాల్యమునుగలిగియుండెను. ఈపట్టణము మహోన్నతదశయందున్నప్పుడు అందున్న జనుల సంఖ్య ముప్పదిలక్షలకు మించియుండెనని యొకరూహించియున్నారు. ఇట్లు విద్యారణ్యులవారిచే నిర్మింపఁబడిన యీపట్టణము సకలవిద్యాసంపత్తులచే శోభితంబగుటచే విద్యానగరమనియు, నప్రతిమశూరాగ్రేసరులకుఁ బుట్టినిల్లయినందున విజయనగరమనియు, విఖ్యాతివహించి తురుష్కరాజులగుండియ లవియునట్లు దినదినాభివృద్ధిఁజెంది, యైశ్వర్య, శౌర్య, విద్యా, ప్రాభవంబులఁ బ్రపంచమున నీడు లేదని పశ్చిమఖండ వాసులచేతను పూర్వఖండవాసులచేతను వేనోళ్ళఁ బొగడ్తఁగని, మహామ్మదీయ సుల్తానుల దౌర్జన్యమునకుఁ దాళలేక వచ్చిన హిందూముసల్మానుల కందఱికిని రక్షకస్థానమై యొప్పుచుండెను.



# ఆంధ్రదేశము - పండితులు

——)'o(——

సీ॥ వేదవేదాంగాది విద్యాప్రపంచంబు
  విడిముడిగా వల్లెవేసినారు
విజ్ఞానజిజ్ఞాస వేడువారికి నెల్ల
  విద్యల విందులు వెట్టినారు
తమధర్మవర్తన ధరణీదేవతలన్న
  విఖ్యాతి నార్జించి వెలసినారు
తతతితఃశ్శక్తిచేతను నెల్లవారల
  నుత్తూతలూపగా నొప్పినారు

దివ్యమహిమల దిట్టలై తేరినారు
భవ్యగుణముల కిక్కలై పఱగినారు
భద్రయశులగు నప్పటి పండితేంద్రు
లైన నేమిప్పు డసదలై యడలినారు॥

సీ॥ అర్థార్జనపు వృత్తు లనుగుల కిచ్చి తా
మరసి భిక్షాపాత్రి మందినారు
భాగ్యభోగ్యాల్ దక్కు ప్రజల కర్పణజేసి
తా ముంఛవృత్తులఁ దనరినారు
ప్రజ్ఞ కల్మిని సిరుల్ బడయజాలి తమంతఁ
బర్ణకుటీరాల బరగినారు
ఆఖండలత్వైన నందు నర్హతగల్గి
యాధ్యాత్మికతనూని యలరినారు
తాము నిష్కామ్యవర్తనఁ దనరియున్నఁ
దమ తపశ్శక్తి లోకహితంబుకొఱకు
నహరహంబును నర్పించి రాదిబుధులు
నైన నేమిప్పు డనదలై యడలినారు॥

సీ॥ తరతరంబుల లోకధారణులగువారు
తాటోటులనుచును దరుమఁబడిరి
సదసత్తులనుదెల్పి సరవిజూపెడు సాధు
లక్కృతవిద్యు లటన్న నలఁతఁబడిరి
లోకసంస్థితి నవలోడించువార ల
లౌకికవిఖ్యాతి నందికొనిరి
చతురుదధిపరీత జగముకై శుభముల
నర్థించువారలు వ్యర్థులైరి

కాని వారికిఁ గంచాలు గటకములును
నైనవారికి నాకు లన్నట్టులయ్యె
పండితు లపండితు లనంగఁ బడినవార
లౌర ! కాలముమహిమ మేమనఁగఁగలదు॥ 3

సీ॥ ఆంధ్రత్వమన్నది యఖిల విద్యాస్పదం
బన్న విఖ్యాతి నేఁడకట మాసె
చౌషష్టి విద్యలఁ జతురులనెడిఖ్యాతి
శివశివా! యేనాఁడొ చెల్లిపోయె
నిగమాగమాదుల నిధులన్న విఖ్యాతి
నివురుగప్పిన నిప్పు నిలుకడయ్యె
ఘనజటాస్వాధ్యాయ ఘనులన్న బిరుదు పే
ర్లక్కటా! నేటికి ట్లడగిపోయె

దర్శనజ్ఞాన మెన్న 'సుదర్శనంబ'
టన్న పరిహాస విధులకు నగ్గమయ్యెఁ
బండితులలోన స్వావలంబనము లేమి
నౌర ! కలికాలమహిమ మేమనఁగఁ గలదు॥ ౪

సీ॥ 'పంచమేహాని' యను పరనిర్వృతిగలారు
బ్రిదుక నాసాయము బడలవలసె
నధ్యాత్మచింతల నలరువా రహరహం
బాధిభౌతికచింత లందవలసె
నాచారవిధిఁ బొద్దు లలమువా రనయ మ
నాచారసంగతి నలయవలసె
వాఙ్మనశ్శౌచాల వఱలువా రిట్టు ల
నార్యవర్తనముల నవయవలసె

జపము కీనాటి కేవిధి సేయలేక
చింతతో వందురి సతంబుఁ జివుకవలసె
దైవమా! యెట్టిపాపాల దరసినారొ!
పండితుల జీవితప్రభల్ పాడువాఱె॥ ౫

సీ॥ సంస్కర్త్ర బుద్ధిని శాపాయుధంబుల
వర్షించి గ్రంథాలు వ్రాసి రొకరు
దేశాభివృద్ధి కీదేబె లడ్డంబని
దూషించి నోర్త్రిప్పఁ దులిపి రొకరు
భాషాభివృద్ధి కీబడుగు వేర్పర్వని
ఛీత్కార బహుమతిం జేసి రొకరు
పంచమస్పర్శంబుఁ బనికిరా దందురీ
దేవయ్యలని దుయ్యఁ దిట్టి రొకరు
పండితులటన్న సూద్విపాత్పశువులంచు
బలికి దేశాలఁ బ్రకటింపఁ బంచిరొకరు
దైవమా! ఎట్టి దుష్కృతిం దనరినారొ!
పండితుల జీవితప్రభల్ పాడువాఱె॥ ౬

సీ॥ మంచియో చెడ్డయో మమతచే నిందాక
శాస్త్రపోషణముల జరపినారు
తప్పులో యొప్పులో తెమకుగల్గినయట్లు
భాషలో గ్రంథాలఁ బఱపినారు
సుద్దినో రద్దినో సూత్రంబు జెడకుండ
సంఘవ్యవస్థల జరపినారు
కద్దనో వద్దనో ఘనసాంప్రదాయముల్
సడలకుండఁగ జక్క సాగినారు
తోఁచినంతలో మార్గంబుఁ దొలఁగనీక
ఘనతఁ గన్నాకులంబోలి గాఁచి రైన
దైవమా! ఎట్టి దుష్కర్మఁ దగిలినారొ!
పండితుల జీవితప్రభల్ పాడువాఱె॥ ౭

సీ॥ ఆతపస్స్వాధ్యాయ మాశాస్త్రచింతన
లక్కటా! నేడెందు నణఁగినవియొ
ఆపరార్థఫలత్వ మాజ్ఞాననిష్ఠలు
నయ్యారె యేగొందు లగసి నవియొ
ఆయుదాత్త మహత్త్వ మాలోకసంస్థితు
లేలోకముల వల్స లెనసి నవియొ
ఆశాంతిదాంతులు నధ్యాత్మనిష్ఠలు
నేరీతి నంతర్థి నెసఁగినవియొ
వెదకినను గాన మీనాటి విబుధులందు
నాయ స్వార్థంబులే తప్ప సూనృతమ్ము
నేమిసేయంగఁ గలవార మిరవులేక
పండితుల జీవితప్రభల్ పాడువాఱె॥ ౮

సీ॥ భాషాభివృద్ధికై పరిషత్తు లలవార్చు
ప్రభువులు మనలోనఁ బఱగినారు
దేశాభివృద్ధికై దివ్యసేవలఁజేయు
ధీరులు మనలోనఁ దేరినారు
జాత్యభివృద్ధికై సర్వస్వమొసఁగెడి
సరసు లెందఱో మించ సాగినారు
దీనజనంబుల దీనత ల్పోకార్చు
దిట్టలు మనలోనఁ దివిరినారు
అయిన నేమాయె ప్రాచ్యవిజ్ఞానకంద
మంతరించెడి జాడల నఱయఁబోరు
అక్కటా! బీజరక్షణ మాచరింప
కెట్టు ఫలసిద్ధి ముందఱ నెనయువారొ? ౯

సీ॥ కూపస్థమండూక గుణిత నిప్పటి బుధు
లందిరంటను లేదు సందియంబు
ప్రకృతి సంచలనంబుఁ బాటింప రన్నట్టి
మాటసైతము గాలి మూటగాదు
ఛాందసత్వముతోడఁ జరియింతురంటయుం
దప్పుగాదంచు నేనొప్పికొందు
లౌక్యపద్ధతుల నలౌక్యులై వర్తింతు
రంటగూడ నొకింత యుంట నిజమె
అయిన నే మంత మాత్రాన ననదలగుచుఁ
గ్రుంగువారల నెత్తుట కూడదొక్కొ ?
కూర్మి నెనయించి సుస్థితిఁగూర్పఁ జనదొ ?
యార్యత కొకింతలోటొ ? మా యయ్యలార ! ౧౦

సీ॥ ప్రాచీనపరిపాటి భాష్యాంత పాణినిఁ
ప్రవచించు బుధులెట్లు ప్రబలఁగలరొ !
కాణాదవిజ్ఞాన మనతఁ దెల్పెడు విజ్ఞు
లేరీతితో నప్డు నెనయఁగలరొ !
మీమాంస తత్వాల నేమహితులు నెట్లు
వివరింపఁగలవారొ, విశదముగను
వేదమంత్రముల కే విబుధు లర్థము లెట్లు
వివరింత్రొ వీనుల విందుగాను
నాడు మనవలె బుధుల ననాదరించి
యున్న నీమాత్రమును నెట్టు లుండఁగలదొ
కాన నిఁకనైన ఘనబుద్ధి గడలుకొనగ
నాదరముఁజూపి తరియించు డయ్యలార ! ౧౦



## 15

# జాతీయవిద్య

నిజముగా నాన్‌కోఆపరేటర్ల మాటలు విని చెడిన విద్యార్థుల సంఖ్య అపరిమితముగా నున్నది. జాతీయపాఠశాల అని పేరుపెట్టి రాటము త్రిప్పుట, జయధ్వనులు చేయుట, జెండాలు పుచ్చుకొని తిరుగుట వాలంటియరులుగా చేరి పోలీసుపనులను జేయుట మున్నగు వానియందు చేర్చుటవలన పెక్కురువిద్యార్థుల హృదయములు గాలి పాటే కరళ్లుకట్టుకొని పోయినవి. వారి కింక విద్య అంటదు. ఇట్టివారు జాతీయపాఠశాలలో అనేకులు చేరిరి. తుదకు ఉభయభ్రష్టులైరి.

జాతీయవిద్య అని పలుకుటయేగాని దానిని బోధించువారు నిర్వచనము చేసియుండలేదు. రాటము త్రిప్పుటతప్ప అందొక విధానమే కాన్పింపదు. రాటము ఈ కాలమునకు అస్వాభావిక మగుటవలన అనేకుల యిండ్లలో అటుకలు ఎక్కి కూర్చున్నది. ఆ పాఠశాలలో చదువుచున్నా మనిన గ్రంథము లేవి ? చాలును. జాతీయవిద్యకు వచ్చిన పాట్లు ఇవి.

" జాతీయత " యన నేమి ? ముం దీవిషయము పరిష్కారము కాలేదు. నాన్‌కోఆపరేటర్లను జూచిన తెలియదా ? రాటము త్రిప్పు మనుట. హిందీపుస్తకములు చేతఁబట్టుట. గుజరాతీటోపీ నెత్తిమీద పెట్టుకొనుట. గుప్పుగుప్పున సిగరెట్లు పొగవిడుచుచు ఇంగ్లీషు మాట్లాడుట. ఈ మధ్య కొందఱు సిగరెట్లు హిందూజాతీయములు కావని హుక్కాపీల్చుట ప్రారంభించినారు. కొందఱు క్రాపింగులు తీసివేసి అప్పుడప్పుడు నుదుట విభూతి దాల్చుచున్నారు. ఇదియేనా హిందూ జాతీయతకు లక్షణము ? కాకున్నమాని హృదయములకు సంస్కారమేమైన జరిగినదా ? " ప్రభుత్వపాఠశాలల యనుకరణములుగ ప్రస్తుతము నడుపఁబడుచున్న యీ జాతీయపాఠశాలలు శాశ్వతముగ నుండగల వని మీరు నమ్మెదరా ? "

నాఁకోఁ ఆపరేషనులో చేరిన ప్రతివిషయమును ఇట్లు పరాజయము పొందుచున్నది. ఏమన? దేనికిని పునాది లేదు. ఉద్రిక్తచిత్తుల అడావుడిమీఁద గాలిమేడలు కట్టిన అవి ఎగిరిపోవా?

---

# కవిహృదయము

---

చ॥ కవిహృదయంబ! కష్టతర-కల్పన లోఁ క్రీడ బాలబాలికా
నివహపరిగ్రహానుగతి నింపెదు; వేఁ లోకచోటఁ బద్ధిత
ప్రవరసుసూక్ష్మధీబలవి-పాకకళాదురవాప్యభావగా
రవరచనాగభీరతను-ప్రాసెదు నీప్రభ నెన్న శక్యమే?

చ॥ నవరసయానపాత్రము, స-నాతనమధ్యనవీనసత్క-వి
త్వవిభవశోభితావిరళ-భావనిబద్ధనిసర్గకల్పితో
త్సవవిమలాకృతిగ్రహణ-తత్పరమంగళదర్పణంబు స
త్క-విజనమానసంబు, గుణ-గౌరవలాలస మెన్న శక్యమే?

చ॥ హరిహరపద్మగర్భదివి-జాధిపరాజసనాథమానవే
శ్వరవరవర్ణనీయ రస-సౌరభగర్భితసత్క-థాసుధా
కరకిరణప్రసారసువి-కస్వరవాక్కు-ముదంబవై మనో
హరసుకళాపరీమళము- నందె దహా! నినుఁదెల్ప శక్యమే?

శా॥ ధీరానీకముహుర్ముహుర్గరితభ-క్తిజ్ఞానవైరాగ్యయో
గారూఢాఖిలధర్మసంచయసుఖ వ్యా-ఖ్యాతృసద్దేశికా
చారప్రేరితసన్మతప్రబలకృ-త్సంజ్ఞాప్రచారక్రియా
ధౌరంధర్యము, సత్క-వీంద్రహృదయా-స్థానంబు, సామాన్యమే.

సీ॥ కోమలపదనియు-క్తామలరామభా, రతకథాకలితపు-రాణశైలి
సకలసమ్మోదకా-ష్టాదశవర్ణనా, ప్రాగ్భారసహితప్ర-బంధశైలి
నఖిలప్రపంచవృ-త్తాదర్శకప్రాయ, నాటకానీకబా-హాటశైలిఁ
జిత్రచిత్రకథావి-శేష గర్భితమహా-ఖ్యాయికాచిత్తాప-హారశైలి

గీ॥ సమరగంగాప్రవాహార-వానుకరణ,
పుస్తకాఖ్య సమీచీన-భూతలమునఁ
బ్రతిభగీరథవిఖ్యాతిఁ- బ్రబలఁజేయు
నార ! కవిహృదయప్రౌఢి- నరయవశమె ?

శా॥ అమ్మా ! సత్కవిమానసమ్మ ! వినుమీ-యష్టాదశోద్వర్ణనా
ధ్యమ్ముల్ ప్రాక్కవివాక్యపద్ధతులు స-త్యమ్మాను తన్మార్గచా
రమ్మే పూనద వేల ? సర్వకవితా-రంభంబులన్ నూత్నవే
షమ్ముల్ గైతకుఁ జూచువారికిని తో-షమ్మీయఁగాఁ జాలవే ?

క॥ ఆనఖశిఖవర్ణనమున్, బూని మహాకవులు మునుపు-పోయిన గతులే
ధీనియతి మరలఁ గైకొనఁ,గా నేమిటికమ్మ ! శ్రీవి-కాసత లెన్నన్॥

ఉ॥ చర్వితచర్వణంబు కవి-జాలము మున్న రచించియున్న యా
పూర్వకథావిధానము లె-పూనుట, తత్కళ సంగ్రహించి ధీ
ధూర్వహుఁడైన సూరనకృ-తుల్ గుఱిఁగూర్చి, వినూత్నవర్ణనా
ఖర్వకవిత్వవైఖరులఁ-గబ్బములన్ రచియించు టొప్పదే ?

శా॥ ఏభాషార్ణవగర్భగోళమున నే-యేస న్మణిస్తోమముల్
స్వాభావానుగతప్రదీప్తులను జా-జ్వల్యంబు లౌనో తదీ
యాభల్ గైకొని యుష్మదీయకవితా-వ్యాపారముల్ గూర్చ నీ
శోభల్ వానికి మించుఁగాదె కవివా-క్సృద్ధాంతమా చూడుమా !

# తెనాలిపురము

కృష్ణరాయల యాస్థానకవిదిగ్గజములలో నొక్కఁడైనను కాకపోయినను, ఏమహానుభావుఁడు "సకలభూపాలకాస్థానకమలాకరోదయ తరుణ సూర్యోదయుండ"ను విఖ్యాతిగాంచెనో-కలికానకైన నిరర్థక పదము లేకుండఁదేనెలొల్కు పలుకులతోను మురిపెములు గుల్కు జాతీయములతోను ముద్దులు మూటలుగట్టు సమాసములతోను మాన

సమును సంతోషసాగరమున డోలాకేళిసల్పు చిత్రవిచిత్ర కల్పనముల తోను రసగుంభితముగ స్థలపురాణమును ధూర్జటి శ్రీనాథాదులవలె ప్రబంధరూపమున నిర్మించి కృతినాయకునిచే

"ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టిరా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితా విద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ సరసార్థబోధఘటనా హేలాపరిష్కారశా
రద నీరూపము ... ... ..."

అని తగురీతి సమకాలికులైన మహాకవుల శిరోమణిగఁ గొని యాడఁబడియెనో, యీ పాండురంగక్షేత్ర మాహాత్మ్యవిధాత యీ కవి సహకారవసంతుఁ డాకావ్యరససుధానుండనకుండలుఁ డా శ్రీరామ కృష్ణుఁ డీనగరము నగ్రహారముగ నేర్పఱచినట్లు ప్రబలాధారములు కలవు. మొదటిది లోకప్రతీతి యటుండఁ గవియే తన గ్రంథమున "ఆంధ్రభూమీకుచాగ్రహారాభమైన శ్రీతెనాల్యగ్రహారనిర్ణేత" యని కృతిపతి తన నుద్దేశించి చెప్పినట్లు వ్రాసియున్నాఁడు. రెండవది రమా రమి ముప్పాతిక సంవత్సరముల క్రింద కావలి వేంకటరామస్వామిగారు తమ దక్షిణహిందుస్థాన కవిచరిత్రమునందు ఇక్కవి కృష్ణామండలము లోని తెనాలి గ్రామమున శాలివాహనశకము ౧౩౮౪ సంవత్సరమున జన్మించినట్లును ఈతని యింటిపే రీశ్వరప్రగడ వారయినట్లును వ్రాసి యున్నారు. రావుబహద్దరు వీరేశలింగము పంతులుగారు తమ కవి చరిత్రయం దతని వాసస్థలము కృష్ణామండలములోని తెనాలి యగ్ర హారమనియు అతని పూర్వులు తెనాలికి రెండు క్రోసులదూరమున నున్న గార్లపాటి కాపురస్థులనియు నితఁడు తన నివాసము నచటినుండి తెనాలికి మార్చిన ట్లెవరో యొకరు వ్రాసిరనియుఁ దెల్పియున్నారు. గురుజాడ శ్రీరామమూర్తిగారు తమ కవిజీవితములలో నిక్కవిది కృష్ణామండలములోని గార్లపాడనియు దానంజేసి యీతని యింటిపేరు గార్లపాటివారనియు నీతని మాతులుం డితఁడు బాలుఁడై యుండ తన గ్రామమైన తెనాలికిఁ గొంపోయి యచ్చటి యీశ్వరుని పేర రామలింగ

మని నామకరణము చేసెననియు వ్రాసియున్నారు. పైన తెల్పఁబడిన విషయములవలన రామకృష్ణుఁడు తెనాలికి సంబంధించినవాఁడనియుఁ దెనాలి కృష్ణామండలములోని తెనాలియనియుఁ దేలుచున్నది. కృష్ణామండలములో నొండొక తెనాలి లేమి యా తెనాలి యియ్యదియని నిర్ధరింపవలసి యున్నది. కాని కొందఱు పెద్దలు "తెనాల్యగ్రహారనిర్ణేత" వను దానిలోని యగ్రహారము నాధార మొనర్చుకొని యా తెనాలి యియ్యది కాదనియు, కవిచరిత్రకారుల యభిప్రాయము లనాధారములగుటచే మరియొక దృష్టాంతము లేనిదో నా తెనాలి యీ తెనాలియని కంఠోక్తిగఁ జెప్ప వలనుపడదనియు వాదించుచున్నారు. వారి యాక్షేపణమంత హేతుపోషితమైనది కాదు. ఇచ్చటి కొక మైలు దూరముననున్న తేలప్రోలు ఒకానొకప్పు డగ్రహార మని చూపుటకు శిలాశాసనములు కలవు. ఇప్పు డది శేరీగ్రామము. ఇట్లె యొకప్పు డగ్రహారములుగ నుండినవి ప్రస్తుతము శేరీగ్రామము లుగ నున్నవి. ఇది యిట్లుండ, నిచ్చటి శ్రీరామలింగేశ్వరస్వామి యుత్స విగ్రహపీఠమున లిఖింపఁబడిన యీ క్రింది శ్లోకము పూర్వోత్తరార్థ సందర్భశుద్ధికలదిగా కాన్పించకపోయినను, పై సంశయవిచ్ఛేదము జేయుటయే గాక యనాధారములని యాక్షేపింపఁబడిన కవిచరిత్ర కారుల యభిప్రాయములకు జీవమొసంగి సంశయాస్పదమని విడువఁ బడిన రామకృష్ణుని కాలనిర్ణయమునకుఁ దోడ్పడుచున్నది.

శ్రీ తెనాలినగరే వ్యరాజయ।ద్గార్లపాటిపుర రామపండితః
శుక్లమాఖసితపంచమీ గురౌ। రామలింగ ముమహోత్సవాకృతిం॥

ఇందలి గార్లపాడు వీరేశలింగకవిగారు తెలియపరచినట్లు తెనాలికి రెండుక్రోసులదూరమున లేదు. సత్తెనపల్లి తాలూకాలో నిచ్చటికి సుమారు పదిక్రోసులదూరమున నున్నది అచ్చట రామకృష్ణుని శాఖ వారయిన యాజ్ఞవల్క్యు లిప్పటికి పెక్కండ్రు గలరు.

ఆమహానుభావునికి పిమ్మట నిచ్చట పెక్కండ్రుకవులు విలసిల్లిరి. వారిలో మతుకుమల్లి మాదన్న, బుచ్చినృసింహశాస్త్రులు, ముదిగొండ బ్రహ్మయ్య లింగమనువారు మిగులఁ బ్రశంసనీయులు. మాదన్న సర్వ

కళాకోవిదుఁడగుటచే నాతని చౌషష్టివిద్యల మూదన్నయని పిలుచు చుండెడివారు. ఆతఁడష్టాదశపర్వప్రయుక్తమైన యభినవభారతమును రచించియున్నాఁడు. శాస్త్రిగారు తర్కవ్యాకరణములఁ గూలంకషప్రజ్ఞ గలవారగుటయే కాక, శైలిని చంద్రికాపరిణయాదుల ననుసరించు నిందుమతీపరిణయమను ప్రబంధమును వ్రాసియున్నారు. లింగముగారు మృదుమధురశైలిని శివరహస్యఖండము నాంధ్రీకరించి యున్నారు. కవితాప్రాశస్త్య మట్లుండ శాస్త్రమునఁ బ్రజ్ఞచూపినవారు లేక పోలేదు. జ్యోతిషసిద్ధాంతమున నుత్తరసర్కారులలో వాడుకలోనున్న పిల్లలమఱ్ఱి పూర్ణయ్య సిద్ధాంతి యీ పురవాసుఁడై యున్నాఁడు.

తెనాలియనునది 'తేరవాలి' యొక్క వికారమనియుఁ దెర వాలి వాలివధానంతరమునఁ దత్పాతక విమోచనార్థము శ్రీరామభద్రు నిచేఁ బ్రతిష్ఠింపఁబడిన శివాలయములుగల వాలి, చెవాలి, పెరవాలి, తెరవాలి, గంగవాలి యను పంచవాలులలో నొక్కటి యనియుఁ గొందఱు చెప్ప వినియున్నాను. దీనికి ప్రమాణము మృగ్యము. కాని దీనివలన నేర్పడు పురపురాతనస్థితికిమాత్రి మీనగరమునకు నుత్తరము నఁగల గృహశల్యాదులు సాక్ష్యము నిచ్చుచున్నవి. కృష్ణరాయఁడు దిగ్విజయార్థ మరుగు మార్గమున నిచ్చట నిల్చి చిత్రిచరిత్రిగల యిచ్చటి గోవర్ధనస్వామికి తేలప్రోలు నగ్రిహారముగ నిచ్చిన ట్లిప్పటికి శిలాశాసనము కలదు.



కం॥ పితృదేవతలు మనుష్యులపితరులకుఁ బ్రసన్నులగుచుఁ బ్రీతి "భవత్స
మ్మతమెది వా(ర)ట్టుఁడు సువ్రతులారా! యిత్తు" మనుడు వారని రిటులన్.
తే॥ "మేము మనుజులపితరుల మోమహాత్ములార! సుకృతంబుకలిమిమేఁ జేరి స్వర్గ
మమరులంగూడి తిరుగుచుంటిమి విమానములపయిం బోవుచుంటిమి వలయుకడకు.
ఆ॥ ఆడ నప్సరసలు పాడ గంధర్వులు పొగడ గుహ్యకులు విబుధులతోడఁ
గూడి యుండుచుంటి మీడుజోడుగఁ గాని యాఁకలికిని దప్పి కాఁగ లేము. ౬౦
ఆ॥ వానికాఁగలేక వహ్నిమధ్యంబునం దున్నయట్లు తలఁచుచురు ఖగములఁ
గొట్టి తిననో లేక పట్టి యచ్చరపిండు గుడువనో దురూహపడుదు మేము. ౬౧
ఉ॥ నాకములోని పక్షులును నాశనముల్ జర లేనివౌటచే
నాఁకలిపట్టలేక తినునాస రహస్యముగా నొకండజం
బేకడనేని పట్టుకొని హింసయొనర్పఁగఁబోవఁ జావది
కేకరణిన్ భరింపనగు నీక్షుధ? యానతియిందు సత్కృపన్. ౬౨
తే॥ అట్లు నందనమున మనోహరములైన చెట్లు ఫలసహితముగ వీక్షింపఁబడెడిఁ
దత్ఫలంబులనేని తిందమని పోయి పట్టి లాగినను దెగిపడ వదేమొ. ౬౩
కం॥ ఈ సురసరిదుదకంబు పిపాసార్తులమగుచు మేము పానము సేయం
గా సమకట్టినఁ జుక్కయు దోసిటిలోపలికి రాదు దోస మదేమో. ౬౪
కం॥ తినువాఁడు త్రావువాఁడును గనఁబడఁ డొకఁడేని యిచటఁ గావున స్వర్గం
బున మనికి మాకుఁ జూడఁగ ఘనకష్టంబయ్యె నేమి కలదికఁ జెప్పన్. ౬౫
మత్తకోకిల॥ ఈ యమర్త్యులు గుహ్యకాదులు నెక్కి తాము విమానముల్
హాయిగాఁ జరియించుచుండిరి యాఁకటం దగఁ గుందక
ట్లెయెదం దమి మేమునుందుమొ యీక్షుధార్తికిఁ గారణం
బేయదో వివరించి మాశ్రమమెల్లఁ బాపుఁడు విశ్రుతుల్! ౬౬
తే॥ మీరు పెద్దలపితరులు మేము నరులకుం బితాళ్ళము కావునఁ గోరిమిమ్ము
శరణటంటిమి మాకిఁక శాశ్వతంపు బలిమి నొడగూర్పుఁ డమరులకట్లు యట్లు." ౬౭
కం॥ అనియిట్లు నరులపితరులు మనవియొనర్చుటయు వారు "మాకును ఘనవా
హనుఁదొట్టి సురలు శ్రాద్ధములొనరింపనియపుడు కష్ట మున్నదె యిటులన్. ౬౮
తే॥ అందువలనను వచ్చి యియ్యమరవరుల నాశ్రయించుచునుండెద మన్వహంబుఁ
దత్కృతశ్రాద్ధములనుండి తద్దతృప్తి నెనయుచుందుము లోపం బొకింతలేక. ౬౯
కం॥ భవదన్వయసంజాతులు పవిత్రులయి దర్శముఖ్యపర్వంబుల శ్రా
ద్ధవిధు ల్దీర్చినయెడలఁ దనివి యొవ్విధిఁ గలుగకుండు నిచ్చలు మీకున్. ౭౦

చం॥ ఎపుడు ప్రమత్తతం గులజు లించుకతర్పణమేని చేయరో
యపుడు క్షుధం బిపాసం గడు వ్యాకులులయ్యెద రీర లందఱున్.
దపనజపట్టణస్థులగు తక్కటివారి యవస్థ యద్దనే
ల-పితరులార ! మీరుపడులం/పటుకుండు కతం బిదేచుడీ. ౭౧

ఉ॥ కావున మీకుదత్తమగు కవ్యము మాకును బంచియిమ్చుచో
నీవడి నేగి బ్రహ్మకడ కెంతయుం బ్రార్థనసేసి మీకు ల
గ్గౌవిధ మాచరింతు”మని యందుల కొప్పుడు వారిం గొంచుం ద
ద్దేవపితృవ్రజంబు కడు ధీరత వేఱుపు పెద్ద పాలికిన్. ౭౨

చం॥ చని వినయాన్వితంబుగను సాగిలి మ్రొక్కి నుతుల్ పొనర్చుడున్
వనజభవుండు “మీర లిటువచ్చుటకుండిన హేతు వెయ్యదో
మును వచియింపుం డయ్య పితృముఖ్యులు ! నేనె సురాళిం గూడి మి
మ్మనయముం గొల్వవత్తుం గద ! యట్టియవచ్చుట చిత్ర మారయన్. ౭౩

తే॥ మాసవాకారులైనట్టి మఱియుం గొంద ఱల్పతేజస్కులై మిమ్ము ననుసరించి
యున్న వారలు. వీరెవ్వరో యెఱుంగం జెప్పుడీ పితృదేవతాశ్రేష్ఠులార !” ౭౪

చం॥ అనుడుం బితామహున్ గుఱిచి య ప్పితృదేవత “ లార్య ! వీర ల
మ్మనుజులకుం బితాళ్ళు. భువి మంచిపను ల్పొనరించుటన్ దివిన్
మనంగలవారలై రి. సురమధ్యమునం జరియించుచుండిరై
నను నిజవంశ్యు లేరు నొకనాండును గవ్య మొసంగకుండుటన్. ౭౫

చం॥ ఘనమగు క్షుత్పిపాసలకుం గార్శ్యము వీరికిం దప్పదయ్యెం. గా
వున “ననయంబుం దృప్తి మెయిం బొల్చెడిభంగి ననుగ్రహింపుడీ”
యని మము వేడం జొచ్చిరి యజా ! యిపు డంతటిశక్తి మాకు లే
మిని నినుం జేరవచ్చితిమి. మేకొను యట్లొనరింపవే దయన్. ౭౬

తే॥ ఎపుడు సురలను జాపల్య మెనయంగలదో యపుడ యీదురవస్థ మాకందఱికిని
దారసిల్లును బరమేష్ఠి ! వారలిచ్చు కవ్యములం గాక మా కెట్లుకలుగుం దృప్తి. ౭౭

తే॥ కాన మేమును వారలుం గలసి నిత్యతృప్తులముగాంగం గరుణింపు దేవ ! స్వీయ
వంశ్యులిచ్చెడికవ్యము ల్వారు మాకు నిచ్చెదరు. గాన వచ్చితి మిటకు మేము. ౭౮

ఉ॥ దేవతలిచ్చుకవ్యమునం దృప్తిజనింపదు మాకు దేమనన్
దేవ ! క్రియావిహీనమది దివ్యులకుం గ్రియలేదు. “స్నాతులై
పావనధౌతవస్త్రముల భాసిలు భూసురులిచ్చుకవ్యమే
దేవపితృవ్రజంబునకుం దృప్తిద” యంచు శ్రుతు ల్వచించెడిన్. ౭౯

క॥ ఆ పితృపక్షమునందున నోపిక మిముఁగూర్చి శ్రాద్ధ మొనరుపకున్నన్
పాపపుఁ జండాలత్వము ప్రాపించును బితరులార ! ప్రజలకుఁ గానన్ ౧౦౪
తే॥ కూరయో కాయయో యింత కూరుచుకొని సవిత కన్యాగతుండైన సమయమందు
సలుపవలయు దరిద్రుఁడున్ శ్రాద్ధకర్మ. మింతకంటెను వాక్రువ్వ నేమిగలదు. ౧౦౫
సీ॥ తత్పితృపక్షశ్రాద్ధంబుఁబెట్టనిచెట్టఁ గూడి యొక్కరుగుపైఁ గూరుచున్నఁ
దత్పితృపక్షశ్రాద్ధంబుఁబెట్టనిచెట్టుదండ నొక్కటేళయ్యుఁ బండుకొన్నఁ
దత్పితృపక్షశ్రాద్ధంబుఁబెట్టనిచెట్టు పంక్తిఁ గూర్చుండి యప్పములుతిన్నఁ
దత్పితృపక్షశ్రాద్ధంబుఁబెట్టనియట్టి కట్టిఁడిఁ జేసేత ముట్టుకొన్నఁ
జాలనుడులేల. యకృతతచ్ఛ్రాద్ధుతోడ నొక్కచోఁగూడి మాటాడియున్నఁగాని
ధనము ధాన్యము సుఖము సంతతియులేక ఘోరనరకంబునంగూలుఁ గొనకు నరుఁడు.
తే॥ అట్లుగావున నవ్యగ్రులగుచుఁ జనుఁడు ప్రీతి స్వస్థానములకు నోపితరులార !
యతిభయంకర కలికాలమందు సేని పెట్టు, ఈ యొక్కశ్రాద్ధంబు బీదగూడ"
క॥ం అనవిని పితరులు స్వనికేతనములకుం జనిరి ప్రీతిఁ. దచ్ఛ్రాద్ధంబున్
జనులు కలిమోహమునఁబడి పొనరుపఁబోరైరి దుష్టబుద్ధిని భూపా ! ౧౦౭
క॥ అకృతశ్రాద్ధుల పితరులు సకలామరపితృసమూహ సముపేతముగా
నకటాయని వడివడి నజు సకాశమున కరిగి యొరఁగి శరణని మతియున్ ౧౦౯
శా॥ "దేవా ! యేటికి నొక్కమాఱయిన నాదిత్యుండు కన్యాగతుం
డై వర్తిల్లెడివేళఁగూడ ఖలులౌ వస్మత్కులస్థాలిచేఁ
గావింపంబడవయ్యె శ్రాద్ధములు తృప్త్యాకార్యంబు ప్రాప్తించెమా.
కీవేదిక్కిఁక. మున్వటుట్లు చెపుమీ యేదో ప్రతీకారమున్. ౧౧౦
తే॥ ఏటికొకపరి మా కన్నమిడనివంశ్యు లున్ననొక్కటె పేర్మిని చన్ననొకటె.
వీఁక వంశక్షయంబైనఁ గాకపోయెఁ. బుడమిఁబడియుండుచుంటిమి పోయి వగుడ"
క॥ అనవిని వనజాసనుఁ డాత్మను యోజనచేసి తడవు తద్దయుఁగృప ని
ట్లను. "మీర లెప్పటికి ముదమెనయఁగనగు చిన్నియనువు నెఱిఁగిటి వినుఁడీ ౧౧౨

## —• గయాశ్రాద్ధము. •—

ఆ॥ ఒక్కసారియేని మిక్కిలిశ్రద్ధమై గయను మిమ్ముఁగూర్చి కవ్యమిడినఁ
దత్ప్రభావమునను దప్పక దివ్యత్వ మెనయఁగలరుమీర. లింత నిజము. ౧౧౩
సీ॥ బ్రహ్మహత్యందొట్టి బహుపాతకంబులం గావించినటువంటి కటికయేని
రౌరవంబునఁగూలి ఘోరయమయాతనలకు లోనైయుండినయటువంటి పొందిరేని
పెద్దకాలమునుండి తద్దఁ గుంభీపాక మనుభవించు కృతఘ్నమనుజుఁడేని
దయ్యమైపట్టి తత్తర్జనంబులచేతఁ జెప్పుదెబ్బలుతిను చెనటియేని

స్వీయవంశజుఁ డల గయాశీర్షమునకుఁ బోయి శ్రాద్ధంబుఁబెట్టినఁ బూర్వకృతము
లైన దుష్కర్మముల ఫల మవలఁద్రోసి మోక్షసామ్రాజ్యపదవిని బొందఁగలుగు.

ఆ॥ ఈ మదుక్తము శ్రవణించి యింక మనుజు లధనులయ్యు గయాశిరమందు మీకుఁ
బెట్టుదురు శ్రాద్ధ మొక చేసి పితరులార! ముక్తినిచ్చుచు నత్యాది వ్యక్తమగును"

కం॥ అనియిట్లు చెప్పివారల కనుజ్ఞ యిచ్చుటయుఁ జొచ్చి రాత్మపదము. లా
దినము మొదలొక్కని యేర్పడియెను శ్రాద్ధము లా త్రిపురుష మిల భూపాలా! ౧౧౬

ఆ॥ బ్రహ్మ మొదలుచేసి పాలోకగతులైన స్వకులజులగు తలంచి శక్తికొలఁది
సంతిమందిద్విజుల కపేగిన దిడుచుండి గాలికం బెట్టు బూర్వ్యమవని నాథ! ౧౧౭

ఆ॥ భాగుణేశ్వరా! యుద్దైకశ్య మీయని, యెట్టి పేదయేని పెట్టఁగలుగు.
మర్త్యులుం బితౄశ్వమర్త్యులుగూడ నీకార్యమందుఁ దృప్తిగాంచఁగలరు. ౧౧౮

ఆ॥ కాన నంచి తెలివికలవాఁడు శ్రాద్ధంబు సలుపవలయు నిట్టిసమయములను.
నిహముఁ బరముఁ గోరనేని విశేషించి గయను బిండమీయఁ గడఁగవలయు. ౧౧౯

కం॥ పితరులు తమ కమవస నీక్షతి నెవరును శ్రాద్ధవిధిని జేయకయున్నన్
బితృపక్షాగమమునకుం బ్రతీక్షణము సేయుచుంద్రు పవలును రేయున్ ౧౨౦

కం॥ జలదాగమనంబునకై యిలఁ గర్షకజనములవోలె నెగితయు శోకా
కులులై యటు పడియుండుచు నల పితృపక్షంబుగూడ నరిగినపిదపన్ ౧౨౧

శా॥ కన్యారాశిని సూర్యుఁడుండునపుడు కీడనన్ వంశజుండైన యే
ధన్యుఁడో యిడుఁ బిండమంచు మని యాతరీతిఁగూడం గడున్
దైన్యంబూని యహస్కరుండు తుల మన్దాఁకన్ నిరీక్షింతు రో
మాన్యా! వారల నైరాశ్య మింక వచియింపన్ నోరురా. దేమనన్. ౧౨౨

ఆ॥ ఎదురుచూచిచూచి యినుఁడు వృశ్చికరాశియందుఁ జొచ్చుటయు నిరాశులగుచు
నెవరిస్థానములకు నేగుదు రవ్యాగ లబ్ధిమేఖలాసహస్రనయన! ౧౨౩

ఆ॥ వాయుభక్షకులగుచు వాకిటం బడియుంద్రు రెండు నెలలుగూడ నిండువఱకు
నరులపితరు లట్లు తరణి కన్యం దులఁ గ్రాలునెడను దర్శఁ గాశ్యపీశ! ౧౨౪

తే॥ కానఁ బితృతృప్తివాంఛించు మానవాళి యాచరింపంగవలె శ్రాద్ధ మధికనిష్ఠ.
నజుఁడునుడివినవడువున నన్నహోమును నువ్వులును నీళ్ళు విడువనౌను జననాథ!

ఉ॥ విత్తసమృద్ధి లేదనుచు విజ్ఞుఁ డమాతిథి శ్రాద్ధకర్మమున్
బొత్తిగ మానఁగూడ. దడిపోవిడినన్ రవి కన్యనుండున
న్నైతెలఁగేని చేయవలె. నిద్దియుమాన గయన్ విధింపనౌ.
నిత్తెముఁబెట్టుశ్రాద్ధమున నిండుఫలంబు ఘటిల్లుఁ గావునన్, ౧౨౬

౧౧ గోకేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు
౧౨ చిక్కారాజు మట్టుపల్లిరావుగారు, చెలకోలీ.
౧౩ రాచకొండ వెంకటరామయ్యగారు, ఎనమదల
౧౪ నారాయణరావుగారు, దాతారుపల్లె
౧౫ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు-పాపురం.
౧౬ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు
౧౭ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, వంగపల్లి
౧౮ కవులూరి నరసింహారావుగారు, తాలూకా గుమాస్తా-నర్సారావుపేట
౧౯ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౨౦ బేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట
౨౧ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి
౨౨ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం
౨౩ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం
౨౪ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం
౨౫ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - కొల్లూరు
౨౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట
౨౭ మండ చినవెంకయ్యగారు, దండమూడి.
౨౮ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.
౨౯ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - శాంతాపురం.
౩౦ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం
౩౧ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం
౩౨ తాళవెలిచు లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం
౩౩ కిషన్ రావు దేశపాండ్యాగారు తాళ్లపల్లి
౩౪ వెంకటరాజయ్య, మక్తేదారుగారు - సీతారాంపురం
౩౫ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.
౩౬ ఘంటపల్లి రామారావుగారు, సంగెం
౩౭ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు
౩౮ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.
౩౯ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము
౪౦ కాకిరాల రామచంద్రయ్యగారు, మముదాపురము
౪౧ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు
౪౨ కొండంభట్లగారి వెంకన్న గారు. గుమ్మడిదల
౪౩ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం
౪౪ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-పెదవీడు.
౪౫ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.
౪౬ ఘంటుపల్లి అమృతరావుగారు-సంగెం.
౪౭ మొసలి పాపిరెడ్డి మొకద్దంగారు-కొమ్మెపల్లె.
౪౮ మాణిక్యంగారి బాలకృష్ణయ్యగారు-హైదరాబాద.

# అభినవసరస్వతి

సంపాదకుఁడు – నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3–0–0

## ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 కరిణీకోద్ధారిణి [వూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 12 వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 15 పశ్యాంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 16 పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 1 శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| ూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| ారతీయప్రబోధము (పిలుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| ర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| రతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్యాచ్ఛయనులుగారు) | | 0 | 4 | 0 |

నవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోష్టు,
గుంటూరు జిల్లా.